# వాస్తుపదాలు

## 10.1 ఉద్దేశం :

వేదాంగాలలో ఒకటైన జ్యోతిశ్శాస్త్రాంతర్భాగమే వాస్తు శాస్త్రం. జ్యోతిషానికి, వాస్తువునకు ప్రతిపత్తి ఆధునిక కాలంలో ఎక్కువైంది. మానవుడు సుఖ సంపదలతో, ఆయురారోగ్యాలతో చిరకాలం ఆనందించడానికి అతని నివాసం వాస్తుశాస్త్రంలో చెప్పబడ్డ శుభ లక్షణాలతో నిర్మించబడాలి. శాస్త్ర విరుద్ధ నిర్మాణాలలో నివసించే వారు ఇబ్బందులు పడుతుంటారు. అందువల్ల దోష సవరణలు చేసి గృహాన్ని నిర్మించుకోవడం శ్రేయస్కరం. గృహ నిర్మాణ శాస్త్రంగా వాస్తుశాస్త్రం ప్రసిద్ధి పొందింది. ఈ శాస్త్రాన్ని ప్రాచీనులైన విశ్వకర్మ, మయుడు, త్వష్ట్ర, కశ్యపుడు, భరద్వాజుడు, భృగువు, మానసారుడు, అగస్త్యుడు, మొదలైన వారు లోక కళ్యాణమే పరమావధిగా భావించి సూత్రాలను రూపొందించి భావి తరాల వారికి అందజేసినారు. ఆయా వివరాల నుండి వాస్తు పదాలు, వేధలను గూర్చి అధ్యయనం చేయడానికి ఈ పాఠం ఉద్దేశింపబడింది.

## 10.2 ప్రవేశిక:

గృహాది నిర్మాణాల కోసమై తీసుకున్న స్థలంలో నిర్మాణాలను చేసే విధానము, దానికి తగిన ప్రమాణాలను గూర్చి తెలుసుకోవాలి. ఆయా గృహాలకు వేరు వేరు పద్ధతులలో నిర్మాణ విధానాలుంటాయి. గృహాలను యథేచ్ఛగా నిర్మిస్తే అందులో నివసించే వారి యొక్క శారీరక, మానసిక ప్రవర్తులపై ఆ ప్రభావం పడుతుంది. అందువల్ల వాస్తు లోని వివిధ నిర్మాణ విధానాలను అవగతం చేసుకొని అనుకూలంగా గృహాన్ని నిర్మించడం మంచిది. నిర్మాణానికి ముందు స్థలాన్ని వివిధ భాగాలుగా విభజించే పద్ధతిని పద విభజన అంటారు. ఆయా పదాలు, వాని వివరాలు ఈ పాఠంలో చూద్దాం.

## 10.3 ద్వాత్రింశతి వాస్తుపదాలు:

మయమతము సప్తమాధ్యాయంలో 32 వాస్తు పదాలను గూర్చి ఈ విధమైన వివరణ ఇవ్వబడింది.

శ్లో॥ వక్ష్యేహం పదవిన్యాసం సర్వ వస్తు సనాతనమ్ ।
సకలం పేచకం పీఠం మహా పీఠమతః పరమ్ ॥

ఉపపీఠ ముగ్ర పీఠం స్తండిలం నామ దండితమ్ ।
మండూక పదకం చైవ పదం పరమ శాయికమ్ ॥
తథాసనానం చ స్థానీయం దేశీయో భయ చండితమ్ ।
భద్రం మహాసనం పద్మ గర్భంచ త్రియుతం పదమ్ ॥
వ్రత భోగ పదం చైవ కర్ణాష్టక పదం తథా ।
గణితం పాద మిత్యుక్తం పదం సూర్య విశాలకమ్ ॥
సు సంహిత పదం చైవ సుప్రతీకాంతమేవచ ॥
విశాలం విప్రగర్భంచ విశ్వేంశంచ తతః పరమ్ ॥
తథావిపుల భోగంచ పదం విప్రతి కాంతకమ్ ।
విశాలాక్ష పదం చైవ విప్రభక్తిక సంజ్ఞికమ్ ॥
పదం విశ్వేశ సారంచ తథైవేశ్వర కాంతకమ్ ।
ఇంద్రకాంత పదంచైవ ద్వాత్రింశ త్కథితానివై ।।

అన్ని నిర్మాణాలకు మొదటగా చూడదగిన వాస్తు పదవిన్యాసాల పేర్లు ఈ విధంగా వున్నాయి.

మయమతానుసారం

1. సకలం, 2. పేచికం, 3. పీఠం, 4. మహాపీఠం, 5. ఉపపీఠం, 5. ఉగ్రరూపం, 6. ఉగ్రపీఠం, 7. స్థండిలం, 8. మండూకం, 9. పరమశాయిక, 10. ఆసనం, 11 స్థానీయం, 12. దేశీయం, 13. ఉభయచండితం, 14. భద్ర మహాసనం, 15. పద్మగర్భం, 16. త్రియుతం, 17. వ్రత భోగం, 18. కర్ణాష్టకం, 19. గణిత పాదం, 20. సూర్య విశాలం, 21. సుసంహితం, 22. సుప్రతీకాంతం, 23. విశాలం, 24. విప్రగర్భం, 25. విశ్వేశం, 26. విపుల భోగం, 27. విప్రతి కాంతం, 28. విశాలాక్షం, 29. విప్రభక్తిం, 30. విశ్వేశసారం, 31. ఈశ్వర కాంతం, 32. ఇంద్ర కాంతం.

శిల్పరత్నం, మానసారం గ్రంథాలలో కూడా ఈ 32 వాస్తు పదాలు గూర్చి వివరించారు. అయితే ఆయా పేర్లలో కొంత భేదం కనిపిస్తుంది.

గ్రామ, నగర, పుర, పట్టణ, గృహ, భవన, ప్రాసాదాది నిర్మాణ విశేషాలను బట్టి ఆయా నిర్మాణాల నిమిత్తం స్వీకరించబడ్డ భూమి చతురస్రంగా కాని, దీర్ఘ చతురస్రంగా కాని, వృత్తంగా కాని, త్రికోణంగా కాని, అష్టాశ్రమంగా కాని ఏ విధంగా ఉన్నప్పటికీ దానిని సమాన భాగాలుగా విడదీసే పద్ధతిని పదం అంటారు. ఈ ద్వాత్రింశతి వాస్తు

పదాల వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

నిర్మాణాలకు స్వీకరించబడ్డ భూమి మొత్తానికి సకల, మని పేరు. భూమికి ఈశాన్యం నుండి ఆగ్నేయం వరకు మొదటి సూత్రాన్ని, ఆగ్నేయం నుండి నైరృతికి రెండవ సూత్రాన్ని, నైరృతి నుండి వాయువ్య దిక్కుకు మూడవ సూత్రాన్ని, వాయువ్య దిక్కు నుండి ఈశాన్య దిక్కు వరకు నాలుగవ సూత్రాన్ని కట్టాలి.

ఈవిధంగా సూత్రాల మధ్య నున్న భూమి 'సకలం'

స్థలాన్ని నాలుగు సమభాగాలు చేస్తే ఏర్పడేది 'పేచకం'

స్థలాన్ని తొమ్మిది సామాన భాగాలు చేస్తే 'పీఠం'

పదహారు సమ భాగాలు చేస్తే మహాపీఠం.

25 సమ భాగాలు – 'ఉప పీఠం', 36 సమ భాగాలు – 'ఉగ్రపీఠం', 49 సమాన భాగాలు – 'స్థండిలం', 64 సమాన భాగాలు – 'మండూకం' (చతుష్షష్టి పదం)

8 సమాన భాగాలు – పరమ శాయి (ఏకాశీతి పదం)

100 సమ భాగాలు – ఆసనం(శతపదవాస్తు)

121 సమ భాగాలు – స్థానీయం

144 సమ భాగాలు – దేశీయం

169 సమ భాగాలు – ఉభయ చండిత

196 సమ భాగాలు – భద్ర మహాసనం

225 సమ భాగాలు – పద్మ గర్భం

256 సమ భాగాలు – త్రియుతం

289 సమ భాగాలు – వృత్త భోగం

324 సమ భాగాలు – కరాష్టకం

361 సమ భాగాలు – గణికం

400 సమ భాగాలు – సూర్య విశాలం

441 సమ భాగాలు – సు సంహితం

484 సమ భాగాలు – సుప్రతి కాంత

529 సమ భాగాలు – విశాలకం

576 సమ భాగాలు – విప్ర గర్భం

625 సమ భాగాలు – విశ్వేపదం

21. జలేశ్వర, 22. అసుర, 23. శోష, 24. పాప యక్ష్మ, 25. రోగ, 26. నాగ, 27. ముఖ్య, 28. భల్లాట, 29. సోమ, 30. చరక, 31. అదితి, 32. దితి,

పద భోగం లేని దేవతలు – వహ్ని స్థాన బాహ్యంలో 'చరకి' వాయుపద బాహ్యంలో 'విదారి' పితృగణం బాహ్యంలో 'పూతన' రోగ పద బాహ్యంలో 'పాపరాక్షసి' వీరు స్త్రీ దేవతలని చెప్పబడినారు. వీరికి స్థలంలో అధికారం లేదు.

తూర్పు దిక్కున 'శర్వస్కంధుడు' దక్షిణంలో 'అర్యముడు' పశ్చిమంలో 'జంభకుడు' ఉత్తరంలో 'పిలి పింఛకుడు' అనువారున్నారు. వీరు పురుష దేవతలుగా చెప్పబడినారు. వీరికి గూడ స్థలంలో అధికారం లేదు.

ఈ ఏకాశీతి పదవాస్తువు యొక్క స్వరూపంలో మత భేదాలున్నాయి. ఇంకా చతురస్రంగా స్థలం ఉన్నప్పుడు ఆ భాగం చతురశ్రైకాశీతి పదవాస్తు అని దీర్ఘ చతరస్రంగా ఉన్నప్పుడు దీర్ఘ చతురశ్రైకాశీతి పదవాస్తు అని వ్యవహరింపబడుతుంది.

వా ఉ ఈ

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| రోగ | నాగ | ముఖ్య | భల్లాట | సోమ | చరక | అదితి | దితి | అగ్ని |
| పాప యక్ష | రాజ యక్ష్మ | | పృథ్వీధర | | | | ఆపః | పర్జన్య |
| శోష | | రుద్ర | | | | ఆప వత్స | | జయంత |
| అసుర | మిత్ర | | బ్రహ్మ | | | అర్యమ | | ఇంద్ర |
| వరుణ | | | | | | | | రవి |
| పుష్ప దంత | | | | | | | | సత్య |
| సుగ్రీవ | | యజ | వివస్వాన్ | | | సావి | | భృశ |
| దౌవా రిక | ఇంద్ర | | | | | | సవిత | నభ |
| పితృ గణ | మృగ | భృంగ రాజ | గంధ | యమ | గృహ క్షత | వితథ | పురుష | అనిల |

ప తూ

నై ద ఆ

సమరాంగణ సూత్రధారం ప్రకారం ఏకాశీతి పదవాస్తువు నిర్మాణం భాగాలు తదధిపతులు పై విధంగా వుంటాయి.

## 10.5.2 చతుష్షష్టి పదవాస్తువు :

నిర్మాణానికి స్వీకరించిన స్థలం 64 సమ భాగాలు చేస్తే అది చతుష్షష్టిపదం అవుతుంది. ఈ పదంలో దేవతాన్యాసం క్రింది విధంగా వుంటుంది. బాహ్యావరణంలో 32 దేవతలు అంతర్గత ద్వితీయావరణంలో నాలుగు కోణాలలో ఒక్కొక్క కోణంలో ఇద్దరు దేవతల చొప్పున 8 దేవతలు దిగ్భాగంలో నాలుగు దేవతలు, సర్వ మధ్య భాగంలో నాలుగు పదాలు బ్రహ్మ - పదభోగం కలిగిన వారవుతారు.

ఈ చరకి తూ శరస్కంధ విదారి ఆ

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఈశ / అదితి | పర్జన్య | జయన్త | మహేశ | ఆదిత్య | సత్య | భృశ | అంత / అగ్ని |
| అదితి | ఆప / ఆపః | వత్స | | | | సావి / సవిత | పూష |
| అర్గళ | | పృ | అ | ర్య | మా | | వితథ |
| సోమ | | థ్వీ | బ్రహ్మ | | వి | | గృహ క్షత |
| భల్లాట | | ధర | | | వ | | యమ |
| ముఖ్య | | మి | త్ర | | స్వాన్ | | గంధ |
| నాగ | రుద్ర / రుద్రజయ | | | | | ఇద్ర / ఇంద్రజ | భృంగ రాజ |
| పవ / రోగ | శోష | అసుర | వరుణ | పుష్ప దంత | సుగ్రీవ | దౌవా రిక | మృ / పిత్ర |

ఉ పిలిపించక    అర్యమ ద    పుతన

వా పాపరాక్షసి జృంభక నై

ప

చతుష్షష్టి పదవాస్తువు ( వాస్తువిద్య)

ఈ వాస్తువులో బ్రహ్మకు 4 పదాలు అర్యమునకు 3 పదాలు,

వివస్వానువుకు 3 పదాలు, మిత్రునకు 3 పదాలు, పృథ్వీధరునకు 3 పదాలు, ఉంటయి. అంతఃకోణాలో నాలుగు విదిక్కులలోను సావిత్రి 1/2 పదం, సవిత 1/2 పదం, 1 పదం ( ఆగ్నేయం) ఇన్ద్ర పదం 1/2 - ఇంద్రరాజ పదం 1/2, 1 పదం ( నైరృతి) - రుద్ర 1/2 - రుద్ర జయ 1/2 పదం 1 పదం (వా) ఆపః 1/2 పదం, అపవత్స 1/2, 1 పదం ( ఈశాన్యం ) ఉంటాయి.

బాహ్యావరణంలో ఈశాన్యం నుండి నాలుగు కోణాలలో ఉదతి 1/2 పదం 1 పదం ( ఈశాన్యం), ఈశ 1/2 పదం, అంతరిక్ష 1/2 పదం, 1 పదం ( ఆగ్నేయం) అగ్ని 1/2 పదం, మృగ 1/2 పదం, 1 పదం ( నై ఋతి), పితృగణ 1/2 పదం, రోగ 1/2 పదం, 1 పదం (వాయువ్యం) పవన 1/2 పదం.

ఈవిధంగా బాహ్య కోణంలో 28 పదాలలో 32 దేవతలు వరుసగా ఉంటారు. ఈ పేర్ల విషయంలో స్థానాల విషయంలో మత భేదాలున్నాయి.

### 10.5.3 శతపదవాస్తువు :

గృహ నిర్మాణానికి స్వీకరించబడిన భూమిని చతురస్రంగా చేసి 10 X 10 (100 భాగాలు) భాగలుగ విభాగించాలి. దీనిలో మధ్య భాగంలో 16 భాగాలు బ్రహ్మధికారంలో ఉంటాయి. తూర్పున ఆర్యమునకు 8 భాగాలు పశ్చిమంలో మిత్రునికి 8 భాగాలు, ఉత్తరంలో పృథ్వీధరునికి 8 భాగాలు పద భోగ మవుతాయి. సవిత్రాది దేవతలు, ఏకాశీతి పదవాస్తువులో లాగే అధికారం కలిగిన వారవుతారు. అగ్ని, అంతరిక్ష, వాయు, మృగ, పితృగణ, రోగ, అదితులనే వారు 1 1/2 పదం చొప్పున ఆక్రమించి వుంటారు.

పర్జన్యుడు మొదలైన దేవతలు ఒక్కొక్కరు ఒక్కో భాగాన్ని ఆక్రమించి ఉంటారు.

శతపదవాస్తువులో

| | |
|---|---|
| బ్రహ్మకు | 16 భాగాలు |
| అర్యముడు, సూర్యుడు, మిత్రుడు, పృథ్వీధరుడు | 32 భాగాలు |
| శిఖి, ఆకాశ, అనిల, మృగ, పితృ, పాపయక్ష, రోగ, దితి ఎనమండుగురును (1కి 1 1/2 భాగల చొప్పున) | 12 భాగాలు |
| ఆపః సావిత్రి, సవిత, ఇంద్ర, జయ, రుద్రదాస, రుద్ర, ఆపవత్స | 16 భాగాలు |

ఎనమండుగురకు ( 1 కి 2 చొప్పున)
పరజన్యాది దేవతలకు 24 భాగాలు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| శిఖీ / దితి | దితి | పర్జన్య | జయన్త | ఇన్ద్ర | సూర్య | సత్య | భృశ | ఆకాశ | అగ్ని / అనిల |
| దితి | ఆపః / ఆపః | ఆపః | అర్యమ | అర్యమ | అర్యమ | అర్యమ | సావిత్రి | సావిత్రి / సవిత | అనిల |
| అ ది తి | ఆపవత్స | ఆపః / ఆపః | అర్యమ | అర్యమ | అర్యమ | అర్యమ | సావిత్రి / సవిత | సవిత | పూష |
| భుజగ | పృథీ ధర | పృథీ ధర | బ్ర | హ్మ | బ్ర | హ్మ | సూర్య | సూర్య | వితథ |
| సోమ | ॥ | ॥ | ॥ | ॥ | ॥ | ॥ | ॥ | ॥ | గృహ క్షత |
| భల్లాట | ॥ | ॥ | ॥ | ॥ | ॥ | ॥ | ॥ | ॥ | యమ |
| ముఖ్య | పృథీ ధర | పృథీ ధర | బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ | సూ | ర్య | గంధ |
| నా గ | రుద్ర | రుద్ర / రుద్ర | మిత్ర | మిత్ర | మిత్ర | మిత్ర | ఇంద్ర / జయ | ఇంద్ర | భృంగ రాజ |
| రోగ | రుద్ర / రుద్ర | రుద్ర దాస | మిత్ర | మిత్ర | మిత్ర | మిత్ర | జయ | ఇంద్ర / జయ | మృగ |
| రోగ / పాప / యక్ష్మ | పాప యక్ష్మ | శోష | అసుర | వరుణ | పుష్ప దంత | సుగ్రీవ | దౌవా రిక | పితృ | భృగ / పితృ |

## 10.6. వాస్తు పదాలు - ద్వార నివేశన ఫలాలు :

గృహానికి సింహద్వారం నిర్ణయించేటపుడు అది ఏ భాగంలో నిర్ణయించాలనే విషయం పదభాగాలను బట్టి ఉంటుంది. దేవతా స్థానాలలో మహా ద్వారాదుల నుంచటంలో ఎక్కడ ద్వారముంటే ఏ ఫలితం వస్తుందో తెలుసుకొని నిర్ణయించాలి.

1. ఆదిత్య పదంలో ప్రధానద్వార ముంచితే పుత్రనాశం, 2. సత్య పదంలో ప్రధాన ద్వారకముండిన మిత్రభంగం, 3. భృశపదంలో పతి వియోగం, 4. అంతరిక్ష పదంలో వినాశం, 5. అగ్ని ( అనిల) పదంలో గృహ యజమాని నాశం, 6. పూష

పదంలో ద్వారముంచితే దారుణ, శోషణాదుల వల్ల నాశం, 7. వితథ పదం యజమానికి మృత్యువు కలిగిస్తుంది. 8. గృహ నక్షత్ర పదంలో ప్రధాన ద్వారం వల్ల సంపద వృద్ధి, 9. యమ పదంలో సర్వనాశనం, 10. గంధర్వ పదంలో సర్వ కర్మలు, వృద్ధి పొందుతాయి. 11. భృంగ రాజపదం విపత్తును, 12. మృగపదం సస్యహానిని, 13. నైర్ఋతిపదం విత్తును, 14. దౌవారిక పదం నాశనాన్ని కలిగిస్తాయి. 15. సుగ్రీవ పదం సమస్త లాభాలను కలుగజేస్తుంది. 16. పుష్పదంత పదంలో ప్రధాన ద్వారం వల్ల సద్గుణాలు కలుగుతాయి. 17. వరుణపదం శత్రువులు లేదా చోరుల వల్ల భయం కలిగిస్తుంది. 18. అసురపదం శ్రమను, 19. శోషపదం క్షీణత్వాన్ని 20. రోగ పదం పాండురోగం లేదా దానికి సమానమైన వ్యాధిని కలిగిస్తాయి. 21. వాయు పదం వాతరోగాన్ని, 22. నాగ పదం సర్పభయాన్ని, 23. ముఖ్యపదం బ్రాహ్మణ్యాన్ని కలిగిస్తున్నాయి. 24. భల్లాట పదం యజమానికి విశిష్టతను కలిగిస్తుంది. 25. సోమ పదంలో ద్వారం వల్ల యజమాని యజ్ఞయాగ ధర్మకర్మ శీలుడవుతాడు. 26. అర్గళపదం నీటి వల్ల మరణాన్ని 27. అదితి పదం కుక్షి రోగాన్ని, 28. ఉదితి ( దితి) పదం స్త్రీ, కుల నాశనాన్ని కలిగిస్తాయి. 29. రుద్ర ( ఈశ) పదంలో ద్వారం వల్ల వహ్ని భయం, 30. పర్జన్యపదం ధననాశనాన్ని 31. జయన్త పదం విజయాన్ని, 32. మహేన్ద్ర పదం మహాత్మ్యన్ని కలిగిస్తాయి.

ఈ విధంగా 32 బాహ్యదేవతా స్థానాలలో ఆయా స్థానాలలో ప్రధాన ద్వారం ఉండడం వల్ల ఆయా ఫలితాలు కలుగుతున్నాయి.

వీటి ప్రకారం తూర్పు దిక్కున ప్రధాన ద్వారం పెడితే జయన్త, మహేన్ద్ర పదాలలో, దక్షిణ దిక్కున ప్రధాన ద్వారం పెడితే గృహక్షత, గంధర్వ పదాలలో, పశ్చిమ దిక్కున ప్రధాన ద్వారం పెడితే సుగ్రీవ, పుష్పదంత పదాలలో ఉత్తరదిక్కున ప్రధాన ద్వారం పెడితే ముఖ్య భల్లాట, సోమ పదాలలో పెట్టడం వల్ల శుభ ఫలాలు చేకూరుతాయి.

కాని, మయమతం ప్రకారం 32 దేవతాపదాలలో మహేన్ద్ర రాక్షస ( గృహక్షత) పుష్పదంత, భల్లాట అనే నాలుగు పదాలలో మాత్రమే ప్రధాన ద్వారం శ్రేష్టమని మిగిలిన పదాలన్నింటిలో ప్రధాన ద్వారం పెట్టడం దోషమని, అంతర్ద్వారం కూడా పై పదాలలో మాత్రమే పెట్టాలని చెప్పబడింది.

మతాంతరంలో ఒకే దిశలో ప్రధాన ద్వారం ఉప ద్వారం నిర్మించదలచినపుడు -

తూర్పు దిక్కు మహేంద్ర పదంలో ప్రధాన ద్వారం, భృశ, పర్జన్య పదాలలో ఉపద్వారాలను పెట్టాలి. దక్షిణ దిక్కుకు గృహక్షత పదంలో మహాద్వారం, భృంగ, పూష పదాలలో ఉపద్వారాలు పెట్టాలి. పశ్చిమం వైపు పుష్పదంత మందు మహద్వారం, దౌవారిక, శోష పదాలలో ఉపద్వారాలు నిర్ణయించాలి. ఉత్తరం వైపు భల్లాట పదంలో మహద్వారం, నాగ, దితి. పదాలలో ఉపద్వారాలలో ఉపద్వారాలను నిర్ణయించాలి.

ఈ విధంగా వాస్తు పదవిన్యాసం చేసి. అందులో నిర్మించదగిన అంశాలను జాగ్రత్తగా నిర్మిస్తే అందులో నివసించే వారు సుఖ జీవితాన్ని ఆనందాన్ని అనుభవించగలరు.

## 10.7 వాస్తు పద మర్మ సంధులు

వాస్తుపదాలు ఆధారంగా ఈ మర్మ సంధులు నిర్ణయిస్తారు. నిర్మాణానికి తీసుకోబడ్డ స్థలంలో సిరలు, వంశములు, అను వంశములు, సంధులు, అనుసంధులు, మర్మలు, మహా వంశములు అనే స్థానాలున్నాయి. (వాస్తుపురుషుని) కర్ణ గతములైన సిరలు నాడులనబడతాయి. పదంలో 16 వ భాగం వాని ప్రమాణం. తూర్పు పడమరలుగా, ఉత్తర దక్షిణాలుగానున్న రేఖలకు మహా వంశములు అని పేరు. పదంలో 5 వ వంతు వాని ప్రమాణం పై వాని లోని రేఖలకు వంశములని పేరు. 'అడ్డంగా గీయబడ్డ పొడవైన రేఖలకు అనువంశము లని పేరు. వీని సంగమ స్థానాలు మర్మములు అంటారు. వంశములకు పదములో 8 వ వంతు, అనువంశములకు 10 వ వంతు, మర్మములకు 12 వ వంతు, ఉప మర్మములకు పదంలో 16 వ వంతు ఉంటాయి. 8 వంశముల సంధి ఎక్కడుంటుందో దానికి సంధి అని పేరు. ఇతర అంగ సంబంధం కలిగిన వాటికి అనుసంధులని పేరు. శాలాగ్ర ప్రమాణంలో సంధి ఉంటుంది. అను సంధి శాలాగ్రంలో సగం ఉటుంది.

ఈ ప్రదేశాలను జాగ్రత్తగా గమనిస్తే ఆయా ప్రదేశాలలో ఇంటి గువ్మాలు, దూలాలు, స్తంభాలు మొదలైనవి పెట్టకుండా నిర్మాణాలు చేయాలి. ద్వార స్తంభాది ద్రవ్యాలను ఈ ప్రదేశాలను వదిలి మిగిలిన స్థానాలలో మాత్రమే పెట్టాలి.

### 10.7.1 ఏకాశీతి పదవాస్తు - మర్మ సంధులు

ఏకాశితి పదవాస్తు విన్యాసానికి తూర్పు ముఖంగా 10 రేఖలు, ఉత్తర ముఖంగా పది రేఖలు స్థలంలో వేయాలి. ఈ 20 రేఖలనే నాడులు అని అంటారు. ఈ విభాగంలో ఈశాన్యం నుండి నైరృతికి ఆగ్నేయం నుండి వాయువ్యం వరకు ఒక్కొక్క కోణ రేఖను గీయాలి. తరువాత 3 పదాలను ఒక్కొక్క రేఖ వేయాలి.




ఏకాశీతి పదవాస్తువు

పెద్దకోణ రేఖలకు రజ్జువులని పేరు. వాస్తువు 10 రజ్జువులతో 20 నాడులతో కూడుకుని ఉంటుంది. వాస్తు క్షేత్రంలో నాడులకు, రజ్జువులకు ఎక్కడ కలయిక సంభవిస్తుందో ఆ ప్రదేశమునకు మర్మ స్థానం అని పేరు. ఇటువంటి నాడీ, రజ్జ సంయోగం వల్ల ఏర్పడ్డ మర్మ స్థానాలు అనేకం ఉంటాయి. కొన్ని చోట్ల 3, మరి కొన్ని చోటుల్లో 4, 5, 6, 7, 8 నాడీ రజ్జు సూత్రాల సంబంధం కనిపిస్తుంది. 8 నాడీ రజ్జువుల సంయోగ ప్రదేశానికి మహామర్మం అని పేరు.

ఇటువంటి మహామర్మాలు ఏకాశీతి పదవాస్తువులో 4 ఉంటాయి. ఇవి నవ పదాత్మక బ్రహ్మకు నాలుగు కోణాలలో ఉంటాయి. ఆరు నాడీ రజ్జు సూత్రాల సంయోగం వల్ల సంధులు ఏర్పడుతాయి. ఇవి 24 పదములు గల దాని మధ్యంలో 4 సూత్రాల మధ్య

గల 8 పదాలలో, సర్వ కోష్ఠ పదంలో నాలుగు కోణాలలో ఉంటాయి. ఐదింటి సంధులు ఒక్కో దిక్కుల్లో రెండు చొప్పున నాలుగు దిక్కుల్లో ఎనిమిది ఉన్నాయి. ఇవి వాస్తు పదం చివరలో 3,4 పద సంధిలోనూ 6,7 పద సంధిలోనూ కలుగుతాయి. నాల్గింటి యొక్క సంధులు నాడుల వలనే కలుగుతాయి. ఇవి కర్ణ సూత్రాలకు, రజ్జువులకు మధ్యలో ఉంటాయి. వీటికి ఉపమర్మాలని పేరు. పద మధ్యంలో రెండు రజ్జువుల కలయిక దోషప్రదమైనది కాదు.

### 10.7.2 చతుష్షష్టి పదవాస్తువు - మర్మాది నిర్ణయం

చతుష్షష్టి పదవాస్తువును వేసి దాని రెండు కోణాలలో రెండు సూత్రాలను (సిరలను) వేయవలెను. తూర్పు, ఉత్తరాలకు వ్యాపించిన రేఖలకు వంశములు అని పేరు. కోణ సూత్రాలను ఇరువైపులా రెండు సూత్రాలను వేయాలి. అవి ఈశాన్యం నుండి నైఋతికి, ఆగ్నేయం నుండి వాయువ్యానికి వేయాలి. వాని రెండువైపులా మహేంద్ర పదం నుండి యమ పదం వరకు ఒక రేఖను, గృహక్షతం నుండి వరుణ పదం వరకు ఒక రేఖను, పుష్పదంతం నుండి సోమ పదం వరకు ఒక రేఖను, భల్లాట పదం నుండి మిత్ర పదాంతం వరకు ఒక రేఖను వేయాలి. వీటికి అను వంశములు అని పేరు.

నాలుగు దిక్కులకు బాహ్యస్థాలైన మూడు రేఖలకు సంధులని, మర్మాలు సూత్ర సంధులని, ఉప మర్మ పదాలలో ఉన్న రెండు అను వంశ సంధులకు లాంగలము అని పేరు. వాస్తు పురుషుని శిరస్సు, ముఖం, నాభి, స్తనాలు, హృదయం ఈ ప్రదేశాలకు మహామర్మాలని పేరు.




వాస్తు పదాలలో 12 విధాల మహామర్మాలున్నట్లు అగ్ని పురాణం – 93 అధ్యాయంలో చెప్పబడింది.

1. మహామర్మ, 2. అనుజం, 3. హలం, 4 త్రిశూలం, 5. స్వస్తికం, 6. వజ్రం, 7. మహాస్వస్తికం, 8. సంపుటం, 9. త్రికటం, (త్రికోష్ఠం), 10. మణిబంధం, 11. సు విశుద్ధం, 12. పదం – ఈ మహా మర్మాదులను గోడలు, ద్వారాలు కిటికీల నిర్మాణాలలో వదిలి పెట్టాలి.

వాస్తు పురుషుని ముఖం, హృదయం, నాభి, శిరస్సు, స్థనాల ప్రదేశాలలో 6 మహామర్మాలుంటాయని షోడశపద, చతుష్షష్టిపద, ఏకాశీతి పద, శతపద వాస్తువుల్లో ఈ నాలుగు దిక్కుల్లో సిరలు ఎక్కడ ఉంటాయో అవే మర్మాలని ఒక గ్రంథకారుని అభిప్రాయం.

బృహత్సంహితలో మహామర్మ లక్షణం ఈ విధంగా ఉంది.

రోగపదం నుండి అనిలం వరకు, పితృపదం నుండి శిశు వరకు, విధుని నుండి వరుణాంతం వరకు, ముఖ్యుని నుండి భృశాంతం వరకు జయంతుని నుండి భృంగరాజ పదం వరకు, అదితి నుండి సుగ్రీవాంతం వరకు ఉన్నటువంటి 9 కలయికలు (సంపాతాలు) మహామర్మాలని చెప్పబడినవి. ఈ మర్మాల పరిమాణం పదంలో ఎనిమిదవ వంతు ఉంటుంది.

అదే విధంగా వంశం, సిరల ప్రమాణం గూర్చి ఈ విధమైన వివరణం కనిపిస్తుంది. దేవతలచే ఆక్రమింపబడ్డ పదం ఎన్ని హస్తాల ప్రమాణం కలిగిందో వంశం అన్ని అంగుళాల విస్తీర్ణం కలది అవుతుంది. అంటే పదం 6 హస్త ప్రమాణాలు కలిగిందైతే వంశము 6 అంగుళాల విస్తీర్ణం కలిగిందవుతుంది. సిరలు వంశ విస్తారం కంటె సగం ఎక్కువ పరిమాణం కలిగినవి. అంటే వంశ విస్తారం 6 అంగుళాలైతే సిరల ప్రమాణం 9 అంగుళాలవుతుంది. తూర్పు, పడమరలు, ఉత్తర దక్షిణాలుగా వ్యాపించిన రేఖలకు సిరలు అని పేరు.

ఈ మహా మర్మాది స్థానాలలో గోడలు, స్తంభాలు, ద్వారాలు, దూలాలు, కిటికీల నిర్మాణం ఆ స్థానాలు వేధింపబడతాయి. అటువంటి వేధ వల్ల గృహ యజమానికి కీడు కలుగుతంది.

## 10.8. వాస్తు పురుషాంగ వేధాఫలం

మహామర్మాది వాస్తు పురుష స్థానాలు గృహ నిర్మాణంలో వేధింపబడకూడదు. అటువంటి వేధ వల్ల ప్రభువులకు, బ్రాహ్మణులకు పశువులకు, ఇంటి యజమాని, భార్య పుత్రులు, సోదరాది వర్గాలకు, గృహ నిర్మాతలైన శిల్పులకు పీడ కలుగుతుంది. వేధ లేకుంటే అందరూ కుశలంగా ఉంటారు.

వాస్తు పురుషుని ఒక్కో అంగంలో కలిగే వేధకు ఒక్కోరకమైన ఫలితాలుంటాయి. ఈ వేధలను గమనించడానికి ఏకాశీతి, చతుష్షష్టి శతపదాది పదాలలోని వాస్తు పురుషాకృతి గమనించాలి.

ఆయా భాగాల్లో వేధ వల్ల ఫలితాలు ఈవిధంగా ఉంటాయి.

శిల్పరత్నం అనే గ్రంథం ప్రకారం - వాస్తు పురుషుని శిరస్సు, ముఖం, కంఠం, హృదయం వేధింపబడితే గృహ యజమానులకు లేదా గృహంలో ఉండే వారికి మరణం కలుగుతంది. హృదయ స్థానంలో వేధ కలిగితే హృద్రోగం, పాదాలలో వేధ కలిగితే

కలహం, లలాట స్థానంలో వేధ కలిగితే సోదర హాని, వ్రేళ్ళు పృష్ఠ భాగంలో వేధ కలిగితే ధననాశం, ఊరువులకు వేధ కలిగితే మృత్యువు, బంధునాశం, పత్ని నాశం కలుగుతుంది. గుహ్యంలో వేధ కలిగితే మత నాశనమవుతుంది.

ఎనిమిది సూత్రాలు కలిసే చోట వేధ కలిగితే గర్భనాశనం, ఆరు సూత్రాల కలిసే చోట వేధ కలిగితే శత్రువృద్ధి, నాలుగు సూత్రాలు కలిసే చోట వేధ కలిగితే స్వజన నాశనం, ఐదు సూత్రాలు కలిసే చోట వేధ కలిగితే వ్యాధి, మూడు సూత్రాలు కలిసే చోట వేధ కలిగితే దొంగల భయం కలుగుతుంది. గోడల మధ్యలో కూడా నాడీ రజ్జుల సంగమం రాకుండా చూడాలి.

## 10.9. మర్మాది వేధాఫలం

శిరోవేధ వల్ల పశునాశం, వంశ వేధ వల్ల మృత్యువు, సంధి వేధ వల్ల ప్రవాసం, అను వంశ వేధ వల్ల భయం, త్రిశూల వేధ వల్ల గర్భ నాశనం, లాంగల వేధ వల్ల శిరోవ్యాధి, నాలుగు సూత్రాలు కలయిక వద్ద (సూత్ర చతుష్క) వేధ వల్ల వాహన విచ్ఛిత్తి, సూత్ర షట్క వేధ వల్ల శత్రుత్వం, మహా మర్మ వేధ వల్ల యజమానికి మరణం, ఉప మర్మ వేధల వల్ల సోదలర, పుత్ర క్షయం, మర్మ వేధలందు వంశ నాశనం కలుగుతుంది. సమరాంగణ సూత్రధారంలో మర్మాది వేధా ఫలితాలు ఈ విధంగా ఉన్నాయి.

1. ద్వారాల చేత గోడల చేత మర్మ పీడ కలిగితే యజమానికి మృత్యువు, 3. దూలంచే వేధ కలిగితే భార్యానష్టం, 4. దూలం పై వేసే ఫలకాల (జయస్తులు) చేత వేధ కలిగితే పుత్రుని భార్యకు మరణం. 5. దూలంపై వచ్చే ముష్టి బంధాల ( సంగ్రహాలు) చేత వేధ కలిగితే బంధు నాశనం, 6. కాయాల చేత పీడింపబడితే దేహ పీడ, 7. సంధి పాలాల పీడ కలిగితే మిత్రవియోగం, 8. నాగపాశాలగ్రంధి (ముడి) చేత పీడింపబడ్డ ధనహాని, 9. నాగదంతములు( ఏనుగు దంతముల వలె కర్రతో చేయుబడిన వంకె లేదా చిన్నగుంజలు) చేత వేధింపబడ్డ మిత్ర క్షయం, 10. బురుజు (కపిచ్ఛకము) తో వేధింపబడితే సేవక జననాశం కలుగుతుంది.

షడ్దారుకం (ఆవుకన్ను వంటి కిటికీలు గోడలపై భాగంలో పెట్టాలి) ఆలోకనాలు (లోపలి జనం వెలుపలి వారిని చూడడానికి అనుకూలంగా ఉండేటట్లు వెలుపలి వారికి లోపలి వారు కనపడకుండా కట్టబడే చిన్న కిటికీలు) మర్మ స్థాన మధ్యంలో ఉంటే ధనహాని కలిగిస్తాయి.

ద్వార మధ్య భాగం – ద్వార ద్రవ్య, దూల స్తంభ, నాగదంత, గవాక్షాలచే పీడింపబడితే

(ఎదురుగా ఉంటే) రోగాలు, కులపీడ, ధనక్షయం, గృహ యజమానులకు రాజభయం, పీడనం సంభవిస్తాయి. ద్వార మధ్యభాగం షడ్దారు మధ్య భాగాల చేత కర్ణ (మూల) ద్రవ్యాలచే పీడింపబడితే పై దోష ఫలితాలు కలుగుతాయి.

అను వంశంలో ఏర్పర్చబడ్డ శయ్య యజమానికి కలహాన్నిస్తుంది. శయ్య యందు కాని, కూర్చునే మెత్త తల దిండు భాగంలో నాగ దంతాలుంటే క్షీణత్వాన్నిస్తుంది. కిటికీల చేత స్తంభాల చేత నాగ దంతాలు వేధింపబడితే శస్త్ర భయం, లేదా చోర భయం కలుగుతంది ఇంకా ధన ధాన్య నాశం శోక కలహం కలుగుతంది. ఏ విధంగానైనా మహా మర్మ స్థానం వేధింపబడితే నాశనాన్ని, యజమానికి ప్రాణ భీతిని కలిగిస్తుంది.

అయితే వేధలలో పై కప్పు (అంశుకాలు) వాసాలు, కడ్డీల వంటి ఆచ్ఛాదనా ద్రవ్యాలు (ఊర్ధ్వ వంశాలు), మేకులు, గొడిశెలు (తెంచికలు, ఇంద్ర కీలకాలు) లాంటివి వేధించినా పుర, ప్రాసాద, గృహాలకు దోషం లేదు.

### 10.10 ముగింపు :

పదం విభజించే విధానం, దాని ద్వారా గృహ నిర్మాణం చేయవలసిన ప్రదేశం, ఇతర వివరాలు ఈ పాఠం వల్ల తెలుసుకున్నారు. వివిధ పదాలలోని దేవతల పేర్లు సూర్య కిరణాలే అని పండితుల – అభిప్రాయం. ఒక ప్రదేశంలో కాంతి పడే విధానంలో శుభ కిరణాలు పడే చోట నివసించడం కోసం ఆయా పేర్లు ఇవ్వబడినాయి. అదే విధంగా ప్రస్తుత కాలంలో పదం కట్టి గృహ నిర్మాణం ఎవ్వరూ చేయట్లేదు. వాస్తులోని విజ్ఞానాన్ని విడదీసి చెప్పేవారు, ఆదరించే వారు ఈనాడు కనపడడం లేదు. ఈ రకమైన విభాగాలు చేసి గృహాలు నిర్మించే విధానాలు ప్రాచీన వాస్తు శాస్త్ర గ్రంథాలన్నింటిలోనూ చెప్పబడ్డాయి. ఆ విధానాలు ఆచరించి ఆరోగ్యవంతమైన, ఆనందపు జీవితాన్ని గడపడం సర్వ విధాలా శ్రేయస్కరం.

### 10.11 మాదిరి ప్రశ్నలు :

1. ద్వాత్రింశతి వాస్తు పదాల గూర్చి వ్రాయండి?
2. ఏకాశీతి పదవాస్తు గూర్చి వ్రాయండి?
3. చతుష్షష్టి పదవాస్తువును వివరించండి?
4. శతపదవాస్తువును పరిచయం చేయండి?
5. మర్మ సంధులంటే ఏమిటో తెలిపి వాటిని గూర్చి వివరించండి.